



# అభినవసరస్వతి

యనునొక మాసపత్త్రిక

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ
ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు

సంపుటము ౮ } 1916 సం॥ ఏప్రియల్ { సంచిక 4

విషయములు.

1 కృతివిమర్శము.
2 శంతనురాజచరిత్ర- అన్నంరాజురామయ్య.
3 స్వర్ణకారవ్యవహారము, పత్త్రికాధిపతి.
4 రజస్వలావివాహఖండనము, { చివుకుల అప్పయ్యశాస్త్రి. శివపురపు వీరభద్రపాకయాజి.
5 సూతసంహిత-కొప్పరాజు నరసింగయ్య

చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 | 0 | 0 | సహాయులకు | రు 5 | 0 | 0 |
| పోషకులకు | రు 10 | 0 | 0 | చందాదారులకు | 2 | 0 | 0 |

చంద్రికాముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur
and published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry.

# ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురుపుష్పగిరిస్వాములవారు

## పోషకులు.

1 రాజానారయప్పారావు సింహాద్రప్పారావు బహాదరు జమీందారులు, నూజవీడు

2 రాజా వెంకటాద్రి అప్పారావుబహాదరుజమీందారుగారు,నూజవీడు.

3 రాజా వాసిరెడ్డిచంద్రమౌళీశ్వరప్రసాదు బహాదరు మున్నేరుల్లాకా జమీందారుగారు, ముక్త్యాల

4 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి

5 రామసింగుగారు నెల్లుట్ల పాపురవు సంస్థానము మేనేజరు నెల్లుట్ల

6 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు గుంటూరు.

7 తాడేపల్లి లక్ష్మనరసింహారావు గారు ముక్తాదారు చోల్లేరు.

8 అనంతరెడ్డి దేశాయి గారు పోతారెడ్డిపేట

9 గూడూరు వీరసాంబశివరావుసద్దేశపాండ్యా గారు, మాలెకొండూరు

10 పాములపాటి సుబ్బయ్యగారు, విలేజిమునసబు, నిడుబ్రోలు.

## సహాయులు.

1 బీరకాయల రామారావు దేశముఖు గారు రాయగిరి

2 పరాంకుశం శేషాచార్యులు గారు యాదగిరి

3 నరసింహాచార్యులు గారు-పట్వారీ-కొలనుపల్లి

4 తోర్లకొండ హనుమంతరెడ్డి గారు లోలంవగై రాసేగ్ దారు, యల్లారెడ్డిపల్లె

5 వెంకట నారసింహారెడ్డి దేశముఖు గారు-మిడిదొడ్డి

6 మొదకు శేషారావు దేశముఖు గారు, నల్లబల్లి

7 బాకరాజా పరాంకుశరావు దేశముఖు గారు, యాడవరము.

8 కుప్పా శంకరశాస్త్రి గారు, చివలూరు

9 హేబీబు వెంకటరామారావు గారు వకీలం సిరిసిళ్ళ

10 నరసింహారెడ్డి దేశాయి గారు, కాసరబాద

11 కాకుమాను హనుమయ్య గారు నర్సారావుపేట

12 తంగెడ నరసింహారావు గారు, కరణం, మోజంపాడు.

13 వెలుగూరి పిచ్చయ్యగారు కొదమగుండ్ల

14 తుమురుకోటినరసింహారావుగారు, తిరుమలగిరి.

15 పిల్లలమర్రిసోమయాజులు గారు, తహసీలుదారునర్సారావుపేట

16 టేకుమళ్ళ గోపాలరావుగారు, కరణం, అమిదీపురం

17 ఉల్లగంటివీర రాఘవరావుగారు, ముక్తాదారు, ఆనేపురం

18 శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు తహశీల్ దారు-జగితాల

19 పాకుంట శంకరరావు దేశపాండ్యాగారు-జగితాల

# అభినవసరస్వతి

సంపుట 8 | జూనపాడు. నలనామ సం॥ చైత్రమాసము. | సంచిక


## కృతి విమర్శము.

ప్రీతి — ఇది యద్వైతానందతీర్థులను నొక స్వాములవారు వ్రాసిన వేదాంతవిషయక సంస్కృతగ్రంథము. ఈ యతి పూర్వాశ్రమమున నున్నతోద్యోగపదవి నధిష్ఠించియు సత్కర్మనిష్ఠుండును జనాంతయాజియునై సద్యశమునార్జించియున్న సంపన్నగృహస్థుఁ ఏతద్గ్రంథాధ్యేతలకు గ్రంథకర్త గీర్వాణవాణీనైపుణియు వేదాంతశాస్త్రప్రవీణతయుఁ దెలియుచున్నయేని గాని వేదాంతశాస్త్రమున తత్త్వజిజ్ఞాసువులకంత యుపయుక్తమైనయీ గ్రంథము మాత్రము కాక ఏలయన? జగమంతయు జైనచార్వాకబౌద్ధాది నాస్తికమతంబులం తను గాపిల గౌతమ పాంచరాత్ర పాశుపతాది భేదవాది మతంబుల చేతను వ్యాప్తంబై తత్త్వమార్గ మిదమిత్థమని నిర్ణయింపనశక్యంబై పరస్పరవిమతిచే వ్యాకులంబైయుండ బ్రహ్మాదిదేవతలచే నభ్యర్థితుఁడై కరుణానిధియుఁ గైలాసవాసియు శశాంకశేఖరుండు నగు పరమశివుండు శ్రీ శంకరాచార్యరూపమున భూలోకమున దవతరించి బ్రహ్మసూత్రములకును సందిగ్ధార్థములగు కొన్ని యుపనిషత్తులకును భగవద్గీతలకును భాష్యములొనర్చి యనేకములగు నితరగ్రంథములఁ గూడ రచించి పూర్వోక్త దుర్మతోన్మూలనపూర్వకముగ వర్ణాశ్రమ వ్యవస్థ చేసియుండెనన్న సంగతి విద్యారణ్యాది మహామహ విరచిత గ్రంథోద్ఘోషితమగుటయే కాక కౌర్మ్యాది పురాణప్రసిద్ధముఁ గూడ నయియున్నయది. మధ్వరామానుజాదులచే నిటీవలఁ దద్భిన్న మతము లొకకొంత వ్యాప్తములై యున్నను శంకరసిద్ధాంతితమగు నద్వైతమతము సర్వతోవిస్తృతమై యుండుట వివిధవిద్వద్విదితము. ఇట్టిచో నీగ్రంథమునఁ దచ్ఛంకరమతము సర్వథా వినిందింపఁబడి యున్నయది. శంకరాచార్యులఁట, ప్రీతమువ యోగవిలాసవశులై కలి కాలానుగుణముగ జగత్తనిశ్వరము నసత్యము నను పూర్వపక్షభూత బౌద్ధర్యామతోన్మాద్యాదుల మతము లవలంబించి సేశ్వరమగు జగ

ముందు మిథ్యాత్వతాత్పర్యముతో మంగళాచరణము లేకయే యుష్మ
దస్మదిత్యాది భాష్యమారంభించి కార్యబ్రహ్మవైభవముతోనే శాస్త్ర
పరిసమాప్తిం జేసిరంట. అనుపదిష్ట వేదాంతశాస్త్రులగు సజ్జనులకేని
బ్రహ్మసత్యం జగన్మిథ్యయను నిత్యానిత్యవస్తు వివేకము గల్గియుండనిగ్రం
థమున ననంతకల్యాణగుణుండగు నీశ్వరుండును దదీయయగు మాయయుం
దన్మాహాత్మ్యముతో నీశ్వరుండు సృజించిన యాపంచీకృతభూతములు
నగు జగంబును సత్యములని యుపపాదింపబడియున్నయది. అనంగ
తార్థములనేకములున్నను బ్రకృతగ్రంథమున దప్రామాణ్యబుద్ధిగలుగు
టకుండుటకుం దెలియందగిన యాయంశ మొక్కటికనంబఱచినం జాలెడి,
భాష్యకారులగు శంకరాచార్యులు సూత్రకారులగు వ్యాసుల యభి
ప్రాయము సరిగా గుర్తెఱుంగలేకపోయిరంట- స్వాభిప్రాయప్రకటన
జగంబున సరిగాం గాకున్నఁ జెల్లి నేంటికాలమున కీవృద్ధయతిస్వప్న
మున సాక్షాత్కరించి తత్త్వమున్నివేదించెనంట- అది తాను వ్యక్తీక
రించుచున్నవాఁడంట- అహా! యేమి యీజ్ఞానవైభవము- వ్యాసులు
సూత్రముల వ్రాసినదెప్పుడు? వానికి శంకరాచార్యులు భాష్యము
చేసినదెప్పుడు? అప్పటినుండియు లేని స్వాభిప్రాయప్రకటనమునకైన
విచారము వ్యాసుల కిప్పుడుగల్గి యీయతికి స్వప్నమున సాక్షాత్క
రించి యథార్థ్యమున్నివేదించి తత్పురస్క్రియమై తద్గ్రంథము
లమునం దృప్తిపొందెంగాఁబోలు- స్వప్నసన్నిధ్యయోనియుం గలలోనివా
ర్తలనియు జగన్మిథ్యాత్వమునకు దృష్టాంతము తీసికొనంబడెడి స్వప్న
ముం డీయతికి సూత్రార్థ ముపదేశించుట గగనారవిందసురభిత్వము వంటి
దేకదా? నిజముగా వ్యాసులయభిప్రాయమునకు భిన్నముగానే శంక
రాచార్యులు భాష్యమున్ రచించి యా వ్యాసులకుం దదాది యింత
పర్యంతము నేతాదృశశిష్యుండు దొరకమినే యూరకుండి ప్రకృత మాయా
ద్వైతానందతీర్థులకే యుపదేశింపంగడంగినం జిరజీవియే కాన స్వప్నసా
క్షాత్కారము చేయకున్న సరియైన సాక్షాత్కార మేల చేయరాదు? ఏల
యీ యుపహాస్యాస్పదములగు వ్రాతలు? సాక్షాద్వ్యాసశిష్యుండగు
సూతునిచే స్వసంహితయందుం గారణమగు బ్రహ్మమునకు సత్యత్వ
మును గార్యమగు వియదాది భూతభౌతికమున కంతటికిని సత్యత్వ

మున విద్యాప్రపంచా ద్యుల్లేఖము లేకయే ప్రతిపాదింపఁబడియె. ఇట్లు వ్యాసపుత్రుఁడగు శుకునిచే విద్యాప్రపంచాది దుర్విభాగము లేకుండను "యథామనోరథస్స్వప్న ఇత్యాద్యుపశ్లోకవాక్యతి" మొదలగు వానిచే శ్రీభాగవతమున సమస్తజగత్తునకు మిథ్యాత్వ మభిహితమైయున్నది. వ్యాసప్రశిష్యుఁడగు గౌడపాదాచార్యునిచే సమస్త జగత్తునకును స్వప్నదృష్టాంతమునఁ మిథ్యాత్వము వర్ణింపఁ బడియున్నది. తత్ప్రశిష్యులగు భాష్యకారులచేనైన విస్పష్టముగ విద్యాప్రపంచాదివిభాగము లేకుండ జగన్మిథ్యాత్వము ప్రతిపాదింపఁబడెను. సూతసంహితాప్రణేత వ్యాసుఁడేయగుటనియాంశము వ్యాససమ్మతమని మరల వ్రాయవలసిన యవసరముండఁబోదు. ఇట్లు వ్యాసులశిష్యప్రశిష్యాది పరంపరచే నిర్విశేషబ్రహ్మాతిరిక్తమగు సర్వమును గల్పితమగుట మిథ్యయని స్పష్టముగఁ దెలియఁబడుచుండఁ దాను గురుసన్నిధిని దెలిసికొననిదియుఁ దన కాశ్రమప్రదాతలగు యతులచే సముద్దిష్టమును నగు స్వకపోలకల్పితాభిప్రాయమును భగవంతుఁడగు వ్యాసునిశిరముపై నారోపించుచు శ్రీశుకాదిసిద్ధమగు వ్యాససాక్షాచ్ఛిష్యత్వ మత్యంతవిరుద్ధార్థప్రవక్తయగు తనయం దారోపించుకొనుచు నీస్వామి యిఁక నేవిధి నాదరణీయవచనుఁడగును? ఈయనను బ్రాహ్మణేతరులెట్లు గౌరవింతురు? కలికాలప్రభావ మెల్లెడల వ్యాపించుచుండఁ గొందఱు వర్ణాశ్రమవ్యవస్థ నున్మూలించి వర్ణసాంకర్య మాపాదించుటకును గొందఱు రజస్వలావివాహశాసనములఁ బుట్టించుటకును గొందఱు వితంతూద్వాహములఁ జేయించుటకును గొందఱు ద్వీపాంతరగమనముల సాగించుటకును నిట్లే మేము బ్రహ్మసామాజికులమనియు మే మార్యసామాజికులమనియు బయలుదేరి పలుమంది సనాతనధర్మ మున్మూలనము చేయుచున్నవారు. ఇట్టికాలమున లోకోపకారులగుయతులు సనాతనధర్మోపపాదనపూర్వకముగ గురుభక్తి స్థాపింపవలె. అనాదికాలప్రవృత్తమై మహాపురుషపరిగృహీతమగుమార్గము నలంకరింపవలె. తదనుగుణములగు ప్రబంధముల రచింపవలె. అదివదలి తాను ధర్మసంస్థాపకులగు జగద్గురువులకీర్తిని సహింపలేక ద్వైతాద్వైతమార్గప్రక్షమును నసుప

పద్యమానమును నగు నీమార్గమును బ్రకటించుచున్న యీస్వాముల
వారు యనాదేయవచనులనుటలో నెంతమాత్రము సందేహము లేదు.
“ అఱువదియేండ్లు వచ్చిన నస్తావిస్తమేర్పడు ” నను లోకోక్తి ని యీస్వా
ములవారు ముదిమిచే మతిదప్పి యీరీతి వ్రాసిరని మాయభిప్రాయము.

---

## శ్రీ ర స్తు.

శ్రీ కోటగిరి వేంకటకృష్ణారావు బహద్దరువారి శృంగారతిలక
ముపైని బ్రహ్మశ్రీ బరిజేపల్లి లక్ష్మీకాంత కవిగారొసంగిన యభి
ప్రాయము.

తే. గీ॥ పలుకుపలుకునం దేనియలొలుక మీరు
దెలుఁగొనర్చిన శృంగారతిలకమునను
గ్రాలునక్షరనీలాల మాలలోనఁ
దార్చినాఁడవు దసరిముక్తాలలంతి॥

మ॥ మొలచెన్ మోతలఁపన్ బోలానపరువంపుంగైతయున్ మొల్క,యు
త్కలికన్ జ్ఞానరసప్రవాహములఁదీఁగల్ సాగి,నానాఁటఁగొ
మ్మలలాయంబనుకంబముల్ గొని జగంబన్ బందిరిన్ బ్రాఁకి కీ
ర్తిలతాంతంబులఁజూచి నేఁటికడి కూర్చెన్ సజ్జనామోదమున్॥

గీ॥ కడచెమీకైతకుంజిన్నకన్నెతికము
తెలివిమైదిద్దె శృంగారతిలకమిప్పు
డవ్వలవసంత తిలకంబు నాసఁజేసి
పుష్పబాణవిలాసవిస్ఫూర్తిఁగాంచు॥

శా॥ ఆరూఢిన్ రచియింపుమింక సకలాకాలంక్రియా విచ్ఛిత్తియా
ప్రారంభోరుచమత్క్రియాకలిత భావప్రౌఢముల్, నానటత్
గౌరీనాథజటాటవీతటలుఠద్గంగాతరంగార్భటీ
ధారాటీకవచోనిగుంభ నరసార్ద్రవ్యాహృతుల్ సత్కృతుల్॥

మ॥ సరిరాజుల్ కవిరాజువంచు, సుకళాంచన్మూర్తివంచున్ సుధా
కరవాగర్థసిరూఢివంచు, నకలంకవ్యక్తివంచున్ నుతిం
ప, రసోదారరమాప్రసన్నకవితా పట్టాభిషిక్తుండవై
స్థిరజైవాత్రకతాప్తిచేఁగువలయ శ్రీనిల్పుకృష్ణప్రభూ॥

పగడంబు లెనయంచుఁ బలుక నెట్టులఁజెల్లుఁ
గనుక నేమేవేళఁ జేకట్లఁబడుట
గీ॥ అహాహా! మృదుతరసంపత్తి నతిశయిల్లి
సతతతారుణ్యయుక్తమై సహజసరస
లీలనెసఁగి విశృంఖలోద్వేలగతుల
నొప్పు నా చంద్రముఖి పాదయుగళమునకు॥ 105

తే॥ వేడ్కఁ గుముఖచంద్రుఁ గచనీలవిషధరంబు
పైకొనినఁ దన్మహామిత్రభావమొంది
నట్టిగమనాండజముఁ జేరి యధిపుఁగాచు
కొను భయములగతిఁ జెలి కాళ్లగోళ్ళతనరు॥ 10(

కం॥ అజుఁడు గజగమన గమనము
గజసంపదగాంచు టెఱిఁగి కచ్ఛపములుగా
సృజియించెం బ్రమదంబున
గజకచ్ఛపలీల తొంటిగతి యేర్పడఁగన్॥ 10

తే॥ పంకమునఁబుట్టి బహువిధప్రాప్తి వృద్ధి
బరఁగియుండిన కమలగర్భంబు లీల
యుతుకులై ప్రమోయు స్వర్ణకాహళలు సరియె
చంద్రవదన విసర్గలజంఘికలకు॥ 10

చం॥ నిరతము విభ్రమాప్తిగని నిష్ఠురకర్కశలీలఁజెంది బం
ధురరుచిలేకమీఱు కరితుండము లోవివరంబెఱుంగ కే
సరసిజనేత్రియూరువులసాటికివచ్చి ముఖింగి దీటురా
నరటులుపూని వన్యముల నాకులపాటు వహింపదే ధరన్॥ 1(

మ॥ కులగోత్రాగ్రముల న్వసించి విలసత్కార్స్నసనాసీనయై
బలిమిన్ మారుతిభుక్సముద్ధరణ శుంభల్లీలఁ బెంపొంది ని
శ్చలతన్ ధాత్రీ తపంబొనర్చి మహిళాంచచ్ఛోణియై నిల్చెఁగా
కల రత్నాకరమేఖలాప్తి గననేలా కాకయున్నం దగన్॥ 1

కం॥ ఆవనజనేత్రినాభికి । భావింపఁగఁ బొన్నపూవు పరఁగసరియొకొ।
దావర్తము (సమమనియ)నఁ । గావచ్చును వరదఁ బోవఁగాఁగను
గొనుచున్॥

తే॥ భామినీమణి లేఁగౌను బయలుచొఱఁద
నుపరిసీమకు నాహార్యయుగళి నిలిచె
అతనుచే నట్లు విపరీతమయ్యెనేమొ
కమలసంభవు నిర్మాణకౌశలంబు॥ 112

తే॥ లలితనాభీబిలాంతరస్థలము వెడలి
గురుపయోధరభూధరకూటములకుఁ
బరఁగ నెగఁబ్రాకు మేచకఫణియనంగ
భామ కెంతయుఁ గనుపట్టె రోమరాజి॥ 113

తే॥ వనజదళనేత్రివళులతో వైరమెత్తి
భంగసంపదఁ జెందెఁ దరంగసమితి
అదియెకారణముగను దానాశ్రయించె
భంగనామంబు వాని నభంగగతిని॥ 114

సీ॥ అశ్రాంతఘనవిభ్రమాయాసమునఁ గుందు
రంగుబంగరుబొంగరంబులీడై
కమనీయమార్దవకలితమ్ములై మించు
సరసప్రసూనగుచ్ఛములు సమమొ
తృణకాష్ఠపాషాణధృతిఁ గర్కశతనొందు
కులధారుణీధరకోటిజోడై
పొద్దునఁ గొలఁకులఁ బొలుపుగా జతఁజెందు
మదరథాంగవిహంగములెనయొ

గీ॥ బహుళసుస్థిరలక్ష్మిచేఁ బరఁగవిల్లి
వినుతకాఠిన్యయుక్తమై నునుపుగలిగి

యనిశమును జోడుఁబాయక యలరుచున్న
చంద్రముఖి నిబ్బరపు గుబ్బచన్నుఁగవకు॥ 115

తే॥ హంసవితతికి భోజనంబాటకతన
నవమృణాళంబులను బోల్పఁదగునుగాక
లలితమధుజృంభణాతిమీఱు లతలఁబోల్పఁ
బాటిగా నేర్చునే కొమ్మబాహువులకు॥

కం॥ వళిమురి దరాప్తిగని వె 116
ల్వెలఁబాఱియు మొరసి ముడిఁగి విపరుహాస్త్రీ
గళలక్ష్మికిని బ్రదక్షిణ
మొలమిం గావించుఁబోలు నిద్ధస్ఫూర్తిన్ 117

చ॥ భువనచతుర్దశప్రకటమోహనచారుకళాఢ్యమైన త
త్కువలయనీలవేణి నవకోమలకమ్రదాంశుకంబుతోఁ
పవడముసాటిరాదెకద పక్వదశందనరారు దొండపం
డనసీపడంగఁజూచియును సాటిగ సామ్యమునంగఁ జెల్లునే॥ 118

కం॥ అతిపృథుతను గతినతనున్
నితంబమధ్యస్తనముల నిర్మించి తగన్
జతురాస్యుఁడు కిలికించిత
వతి మధురోక్తులను మార్దవంబును నిల్పెన్॥ 119

తే॥ అమలకురువిందముల నీరసముగఁ జేసి
దాడిమీబీజములఁ జప్పదనము చేసి
మొల్లమొగ్గల వెన వుచ్చమునుగఁ జేసి
జలజపత్రాక్షిరదనముల్ చెలువుమీఱె॥ 120

కం॥ ఛాయాచోరకరుచితోఁ। బాయనిముకురములఁ దెగడి పంకేజపలా
శాయతవిలోలలోచన। సోయగపుం జెక్కులలరు సుస్మేరములై॥

తే॥ మంజుతరవజ్రపుష్పహేమప్రసూన
విజయబిరుదాంకమొగిఁబూని వెలసెనఁగఁ

గ్రొత్తముత్తెంపునుంగర శోమరుమిగుల
సుందరీమణి నాసిక చూడనలరె॥ 122

క॥ తొమ్మిదుల లెక్కసేయుక । యెమ్మెగులుకు కొమ్మవీను లెన్నఁగ
శ్రీకారమ్ములు నిజమ్ముసుమ్మీ । కమ్మలసంగతిని మిగులఁగనుపట్టు
టచే॥ 123

సీ॥ తమ్ముల సరియంచుఁ దగఁజెప్పవచ్చునే
తమ్ములు పంకజాతమ్ములగుట
కైరవమ్ముల సాటిగా నెన్నఁబోలునే
కైరవమ్ములు దివాభీరులగుట
క్రొమ్మెఱుంగుల దీటుగూర్పఁగఁబాడౌనె
క్రొమ్మెఱుగులు క్షణభంగురములగుట
గండుమీల సమంబుగాఁ బోల్పఁజెల్లునే
గండుమీ లరభంగగరిమగనుట
రాజితాదభ్రశుభ్రవిభ్రాజమాన
రుచిరశుచిమంత్రికర్ణికారుక్ప్రకలిత
చారుదీర్ఘకటాక్షవీక్షావిలాస
గౌరవములైన పూఁబోణి కన్నులకును॥ 124

క॥ అగణితదృఢశౌర్యంబుల
జగములుమూఁడొక్కమాఱుసాధింప మనో
జ్ఞగతుల రతిమకరాంకు లె
సఁగనెత్తినవిండ్లనంగ సతిబొమ లమరెన్॥ 125

మ॥ కమలాక్షీముఖకాంతిలక్ష్మికి శరత్కాలంబునన్ నిండుపు
న్నమరేమీఱు ద్వితీయయామమున జీర్ణక్షీరభృన్మాలికా
రమణీయంబగు వ్యోమమండలమునన్ రాజత్కళంకాప్తిన
ప్రమతంబాసి చెలంగు పూర్ణశశియా సైదోడు భావింపఁగన్॥ 126

సీ॥ తరళాక్షి కురులవిస్ఫురణఁగాంచితలంకి
ఘననీలములు తృణాగ్రాహులయ్యె
పణఁతి పెన్నెరులసంపదఁగాంచిభయమంది
ఘనము ధరాధరాగ్రములఁ జేరె
బాలకకుంతలప్రతిభఁగాంచిచలించి
సమదాళితతి విపినములదాఁగె
లలన కేశప్రబాలతఁ గాంచికలంగి
శైవాలలత జలస్థలులఁజెందె
గీ॥ అహహా! తథ్యంబుసుమ్మిది, యటులఁగాక
యున్న ధరలోన భంగపాటొందువార
లకొగివాటిల్లుగతులు దీనికిఁదనర్చు
టకును గారణమెన్న సించుకయుఁగలదె॥ 127

ఉ॥ గోచరమౌనె యక్కుసుమకోమలి సుందరరేఖ శేషభా
షాచపలేక్షణావిపులచారుమనంబులకైన లేశమున్
వాచకశుద్ధిఁదో మిగుల వర్ణనసేయఁగడంగిరేని హా!
చూచినఁగాక యాపలపుసోయగ మెన్నఁగవచ్చు నేరికిన్॥ 128

చ॥ అతులవిలాసభాగ్యమహిమాస్పదమైతనరారుచున్న త
త్సతిఁ గనుగొన్న పూరుషకదంబములన్ నిజశాంబరీప్రభా
వత భ్రమియించి మించి యనివారణదారుణకౌసుమాశుగ
పృతతుల మర్మభేదనము పంచశరుం డొనరింపఁడే నృపా!॥ 129

తే॥ దాని పరిరంభసంభ్రమోదారచతుర
గతులచే నుల్లసిలువాని బ్రతుకు బ్రతుకు
దాని రతిసౌఖ్యకలననే తనరుచున్న
వానిజన్మంబు జన్మంబు వసుమతీశ!॥ 130

సీ॥ తుహినమహీధరోత్తుంగశృంగస్వర్ణ
కందరమణిసానుకటకములను

సమదభృంగీలసత్సంగీతనిస్స్వాన
రంజిత లవలీ నికుంజములను
శ్రీఖండసానుమచ్ఛ్రిత వాతపోతాం
బాలక సాలాల వాలములను
కైరవకల్హార కంజాతసింజాత
సౌరభోద్గార కాసారములను
గీ॥ విమలశీతలశశిశిలా వేదికలను
సారమకరందనిమ్నగా తీరములను
మంజుతర గోస్తనీకాయమానములను
చాల విహరించుఁ జెలులతో సంతతంబు॥ 131

మ॥ లలనాకోమలపంచబాణ! మదిఁ బోలంజూడ నాశ్యాము నా
జలజాతాంబకహేతి యా చెలువ యా సౌభాగ్యపుంబ్రోవు నా
జిలుఁగుం వెన్నెలసిగ్గు నా తరుణి యా సింగారపుందీవి యా
తలిరుంబ్రాయపుమోహినీరమణి యా తన్వంగి నీకే తగుఁ" 132

కం॥ అని సఖుఁడు నృపతిచంద్రున
కనురాగాద్భుతకుతూహలాతిశయంబుల్
జనియింప నతివిలాసము
ఘనసరసమనోజ్ఞనాట్యకౌశలిఁ దెలిపెన్॥ 133

వ॥ ఇత్తెఱంగున సఖ్యురంగనయున సౌందర్యప్రసంగంబు విన్నవించిన

ఉ॥ ఆ చతురబ్ధిభూమిపతి యాసతివార్తలు విన్న యంతనుం
డాచనుగుబ్బ లాకరము లా మొగ మా కటి యార బాంశుకం
బాచరణంబు లాకచము లన్నియుఁ బల్మరుఁ గాంచినట్లుగా
దోఁచు మొగాని యన్యమికిఁ దోఁచద యాతని మోహమెట్టిదో॥

ఉ॥ ఆరమణీలలామ నవయౌవనకోమలసుందరాన్వితా
కారము రాజచంద్రమునకుఁ గన్నులఁగట్టినలీలఁదోఁప నం

భోరుహాగేహినీసుతుఁడా పుండ్రధనుఃప్రవిముక్త చండశా
తోరుసుమాంబకంబుల మహోగ్రతఁ జూపి కలంచె మర్మముల్॥

తే॥ చండకాండౌఘములఁ దాట్ప్రకాండ మదవి
ఖండనమొనర్చు రాజశేఖరుని గదిసి
చికిలిపూఁటవాన్న తేనియఁ జిలుక తేజ
పాగుశాఖా బళీ! భంగిఁ జెలువుఁ జొచ్చె॥ 137

వ॥ అయ్యెడ, 138

సీ॥ ఖండకోదండ ప్రచండకాండౌఘముల్
మైనాఁటఁ దన కుఱ్ఱిమంత్రిఁ జూచు
చూచిలతాంగి భాసురవిలాసస్ఫూర్తి
పలుమాఱు వాంఛమైఁ దెలియనడుగు
అడిగి తదీయ మోహనమూర్తిసౌరుకు
మదిలోన భావించి కుదురుపఱచు
పఱచితా నాత్మలోపల వెన్నవలెఁ గరం
గుచు నస్స్మరని మోము గొంతవంచు

గీ॥ వంచి కనుమూసి తనరఁ జిత్రించినట్టి
ప్రతిమవై ఖరిదాల్చు, తాల్చి తనలీల
శిరముకదలించు, కదలించి నెరపు నగవు
రాజచంద్రుండు మోహవిభ్రాంతుఁడగుచు॥ 139

సీ॥ భద్రగజశ్రేణులఁ బరఁగుచుండెడిరాజు
కెంతప్రియంబయ్యెఁ గాంతగమన
మాచక్రవాళాచలాంచక్రమేలుభూమి
వరున కెంతరుచయ్యెఁ దరుణిపిరుఁదు
ధనరాశి యర్థార్థితతికిచ్చుదొర కెంత
బంగారమయ్యె స్వర్ణాంగికాంతి

హేమాద్రిధైర్యాభిరాముఁడౌ పతి కెంత
కొండయ్యెఁ బూఁబోఁడి గుబ్బదోయి
గీ॥ విమలసన్మార్గవర్తినయావిభున కెంత
గగనమయ్యె వధూమణి కలికికౌను
అకట యిటువంటిఘనులకు జలజముఖుల
వినుతసౌందర్యరేఖ మోహనముగాదె॥ 140

వ॥ అప్పుడు పురుహూతసన్నిభుండు దెప్పరంబగు మోహంబు ద్రిప్ప లేక కుప్పయై యొప్పుమిగులు ప్రియసఖుంగని యిట్లనియె॥ 141

చ॥ "వరసఖ! నీ మనోజ్ఞతరవాగ్రచనావిభవంబు భారతీ
సరసిజపత్రనేత్రియును జాలదు వర్ణనసేయ నాత్మ, నే
నరయఁగ నేర్తునే పొగడ, నత్తరళాక్షి విలాసలక్ష్మి సు
స్థిరగతి విస్మయాదిగను జిత్తము సంభ్రమమందె నేమనన్ ॥ 142

చ॥ అతనుఁడు చండపుండ్ర విశిఖాసనముం దళివార్వగూర్చి మా
రుతరథ మెక్కితం దటిమి క్రూరమహాశనిసారఘోర తీ
వ్రతర సుమాస్త్రసంతతుల రాయిడిచేసె మదీయమానసం
బతులితలీల నీచులకు హా! దయగల్గునె యించుకేనియున్ ॥ 143

సీ॥ తనువునేచెఁదొడంగె నెనసిగంధపుఁగొండ
గాలి గాదిది దావకీలిగాని
చండతాపమొనర్పసాగెఁ బుష్పంధయ
కులముగాదిది హాలహాలముగాని
ఘనదుస్సహవ్యథాకరమయ్యె స్మరహా యీ
త్కారముగాదిది తీవ్రశరముగాని
గాఢచేతోభయంకరవృత్తిగదె హంస
గణముగాదిది మృత్యుగణముగాని
గీ॥ అకట యివిపాంథజనముల నధికహింస
పఱుప మకరాంకునకుఁ దోడుపడి మనోజ్ఞ

క॥ అచ్చుపడీయున్న దదియు వి
యచ్చరలిపి, దానఁగూడ నలరారవు వీ
రిచ్చెడి ప్రమాణవచనము
లెచ్చో స్వబ్రాహ్మణత్వ మీఁకఁ జూపెదరో॥ 8

క॥ జనమంచివంశజులలో
ఘనులగు శేషాద్రిశర్మగా రద్దానిన్
దెనిఁగించియున్న వారలు
గొనిచదివినఁ దెలియు వీరిగు ట్టెల్లగరుల్ ॥ 8

ఆ॥ *పలుపురిట్లు లేవొకలవు బ్రహ్మాండపు రాణమందటంచు వ్రాయుచు
డ్రదు కానియవ్వియెల్లఁగనఁబడవద్దానఁ గల్లలైనయట్టి కారణమున॥ 9

ఆ॥ తాటియాకులందుఁ దాము బ్రహ్మాండపు
రాణమనుచునేమొ వ్రాసికొని వ్ర

*ఆంధ్రబ్రహ్మాండపురాణము సంపాదకీయభూమిక రెండవపుట.

కొంద అలసులు స్వేచ్ఛగాఁ గొన్నికథలనుగల్పించి యవి ప్రమాణములు బరిగ్రహింపఁదగినవని నిర్ధారణచేయుటకు నివి బ్రహ్మాండపురాణములోనివే యని చెప్ప చుందురు-ఎన్నియో స్థలపురాణములు, ఎన్నియో వ్రతములు, ఎన్నియో గాథలు, ఎన్ని యో రాఁబోవువృత్తాంతములు దీనియందున్నట్లు చెప్పుచుందురు-ఇట్లు చెప్పునట్టివారి కొంచెము చదువుకొనినవారే కాఁబట్టి యెచ్చటనైనం జూడనిది చెప్పసాహసింతుర యని కొందఱునమ్మెదరు-నేను భగవద్దివ్యక్షేత్రదర్శనాసక్తమతినై చిదంబరక్షేత్రమ నకుంబోయి యాభగవద్దివ్యక్షేత్రమునుజూచి యాస్థలమాహాత్మ్యమునుజదివి తెనిఁగించి మేలని నిశ్చయించితిని-తరువాత నొక్కమహాత్ముఁ డాక్షేత్రమాహాత్మ్యమునువివరిం యిది బ్రహ్మాండపురాణములోనిదని చెప్పెను-వేఱొకపండితశిరోమణి నాయందనుర గముకలవారగుటవలననే ఆమాట కల్లయనియు నాపురాణమును జూచినపిదపఁ దె గించవలసినదనియు హెచ్చరించిరి-బొంబాయికిఁ వ్రాసి నూతనముగా ముద్రింపఁబఁ డియున్న నీపురాణమును దెప్పించి చదివితిని-ఆ గాథ దీనియందు గనఁబడలేదు.బ్రహ్మాం డపురాణ మనంతమని కొందఱుచెప్పుచుందురు-దీనిసంఖ్య పంద్రెండువేలు-దీనిని సాంగ ముగాఁజదివితిని-ఇందు సర్వాసందర్భములైన గాథలు లేవు.

మాణముగ నుదాసి మనవారు దాఖలు
చేయఁ దీసికొనిరె న్యాయకర్త॥ 91

తే॥ *బ్రాహ్మణోత్పత్తిమార్తాండపఙ్క్తి నింక
వారయఁగ వలె ధీరు లత్యాదరమున
అచ్చుపడియుండెనది సంస్కృతాక్షరముల
బొంబయిం, గాని డేటందు బోధపడదు॥ 92

క॥ †హరికృష్ణుండను పేరున। వరలెడివిద్వాంసుఁడంట వ్రాసినదది, యా హరి
కృష్ణుం డౌర్కల భూ। సురుఁడఁట, యవ్వారెయుంట క్షోణిసి శ్రేష్ఠుల్॥

క॥ తత్తద్గ్రంథములంగల। మొత్తపుసారమునుదీసి ముద్దుగఁదనవిద్వత్తబ

---

*బ్రాహ్మణోత్పత్తిమార్తాండము 62వ పుటలోఁ బాంచాలబ్రాహ్మణులయుత్పత్తి చెప్పఁబడియున్నది- ౫ గురుఋషులు బ్రాహ్మణులైనట్లున్నది. ఈ ౫ గురుఋషులు చెప్పబడియుండఁబట్టియు మాపూర్వికులుకూడ నీ ౫ గురుఋషులే కాఁబట్టియు మాజాతివారికి వీరే ఋషులైనట్లు చెప్పుచున్నాను (కోట్టవారిరిమార్కు) (ఈ బ్రాహ్మణోత్పత్తిమార్తాండముకూడ దాఖల్ చేయఁగూడదని యాక్షేపించిరి. ఇది బొంబయిలో సంస్కృతమున ముద్రింపఁబడిన గ్రంథము- ఇది యీతగాదా కనుకూలించునిమిత్తమై చేయఁబడినదని సేయఁదలఁచను, ఎంతవఱకు ప్రమాణగ్రంథమో ముందాలోచింపఁబడును ప్రకృతము దాఖల్ మాత్రము చేసికోఁబడినది)

---

*బ్రాహ్మణోత్పత్తిమార్తాండము పాంచాలబ్రాహ్మణోత్పత్తి ప్రకరణము లైంగేశైవాగమే,

శ్లో॥ బ్రాహ్మణానాంచజన్మైవ శివవక్త్రాచ్చజాయతే। పంచవక్త్రసముత్పన్నాః పంచభిః కర్మభిర్ద్విజాః। మనుర్మయస్తథా త్వష్టా శిల్పికశ్చ తథైవచ। దైవజ్ఞః పంచమశ్చైవ బ్రాహ్మణాః పంచకీర్తితాః॥ మనుస్సంహారకర్తాచ మయోవై లోకపాలకః త్వష్టాచోత్పత్తి కర్తాచ శిల్పికోగృహకారకః॥౩॥ దైవజ్ఞస్సర్వభూపాలక స్తావై హితకామ్యయా। లోకానాంపంచ పాంచాలాః అభూవన్ శివవక్త్రతః॥౪॥

†బ్రాహ్మణోత్పత్తిమార్తాండము ౧ వపుట

శ్లో॥ శ్రీగౌతమకులోత్పన్నో జ్యోతిర్విద్వేంకటాత్మజః హరికృష్ణః కరోత్యత్ర బ్రాహ్మణోత్పత్తినిర్ణయం॥

యుల్పడఁ జేయుచు ॥ స త్తీరున బ్రాసెనంటయతఁడరయఁడింకన్॥ 4

ఆ॥ ఉండిరంటవిప్రు లుర్వి నెన్నదిరెండు
తెలుఁగులుగను, వారిలీరు లెల్ల
బోధపఱచుటకును బూనెనఁటీతండు
పొంతకవనమందుఁ జొన్పికొనుచు॥ 5

క॥ తనశ్లోకము లేవో పురా
తనపుర్ శ్లోకంబు లేవొ తద్గ్రంథమునన్
గనుగొన నశక్యమయ్యెడి
ఘనులకు నేని కలగూరగంపయ్యెయుంటన్॥ 6

క॥ కొందఱు బ్రాహ్మణులగ నటె
కొందఱు సువబ్రాహ్మణులగఁ గూరిచె నా భూ
బృందారకవర్యుండట
సందేహంబువలవదింక బ్రహ్మసురులారా!॥

క॥ *పాంచాలబ్రాహ్మణులని। యంచు సువబ్రాహ్మణజనమం దెవిరిన్
వంచి ంచివ్రాసెనతఁడది। కొంచెంజను దెంచి రెందుకో కోర్టుకహో॥ 8

తే॥ విశ్వశబ్దాద్యైమున్న వెలసియుండి
మగుడఁ బాంచాలశబ్దములగు దురోటు
విశ్వపాంచాలశబ్దార్థవేత్తలార!
ఏమిసంబంధమీరెంటి కెఱుఁగఁజెపుఁడు॥ 9

క॥ †బ్రాహ్మణులుగానివారలు
బ్రాహ్మణులము మేమటంచుఁ బైఁబడ విశ్వ
బ్రాహ్మణతంగొనిరట త
ద్బ్రాహ్మణులకుఁ దమకు భేదభావముఁజూపన్॥ 10

---

* బ్రాహ్మణోత్పత్తిమార్తాండము 8వ పుట

శ్లో॥ ఊశబ్రాహ్మణనామ్నావై పాంచాలాశ్చ తతఃపరం

†కమసాలులు మది గాను బ్రాసెసి డెన్నీ సెస్నీసుసూపరెం టెండెంటునపఁబంపినమహాజరర్జీ

...నిస్సందేహము గాను, యేకగ్రీవము గాను అర్జీదారులు నిజమైనబ్రాహ్మణుల

కం॥ బ్రాహ్మణులు కానివారలు। బ్రాహ్మణులమటంచు వచ్చి పైఁబడ
సత్యబ్రాహ్మణతం గైకొనఁద। బ్రాహ్మణులకుఁదమకు భిన్నత ద్దెలవోకో॥
తే॥ ఏలయొక్కఁడు తాటిచెట్టిట్లటన్న
దూడగడ్డికినన్నట్టి దుముకువ్యాల
నదియో చెప్ప నది విశ్వసించుటకును
భువిని విద్వత్త శూన్యమైపోయున్నదియె॥ 102
కం॥ విశ్వబ్రాహ్మణశబ్దం
బశ్వప్రుతమట్లు వ్యర్థమగుననియనుచుఁ
శశ్వత్ఖండన చేయ న
విశ్వాస్యపుఘక్కియొకటి వెదకికొని రిటుల్॥ 103
కం॥ పాంచాలదేశసంభవు। లంచుండిన నొక్కవేళ ననఁదగునేమో
పాంచాలబ్రాహ్మణులని। యెంచఁ బాటిక్రొష్ణుఁడటుల నెటఁజెప్పఁడుగా॥
కం॥ మనుమయముఖులై దుగురుఁ। ఘనులును బాంచాలనామక బ్రాహ్మ
ణులంచని చెప్పినతండచ్చటఁ। గనఁ బాంచాలతకు నేమి కారణమొండుఁ॥
తే॥ *పరులుకొందఱుతా రుపబ్రాహ్మణులయి
మనుమయాదులఁ గొల్తురంచని యోఁగాని
మనుమయాదికవంశసంభవులె యగుదు
రాయుపబ్రాహ్మణులటంచు ననఁడతండు॥ 106

---

తెలియపరచుచున్నవి-"విశ్వ"అను పదము అర్జీదారులగొక్కవర్ణము ప్రస్తుతకాలములో
బ్రాహ్మణులమని చెప్పుకొనెడివారివర్ణమునుండి భేదము తెలుపుటకు ఉపసర్గ గానుంపబడెను

*బ్రాహ్మణోత్పత్తిమార్తాండము పాంచాలబ్రాహ్మణోత్పత్తిప్రకరణము

శ్లో॥ స్వాయంభువస్య పుత్రాత్రి జ్యేష్ఠో ధర్మ్యా ప్రకీర్తితః సామవేదో యజుర్వేదః
క్రమా దృగ్వేద ఏవచ॥౨౭॥ వేదవ్యాసః పంచమోథ ప్రియాత్రి ఉదీరితః। ఏతే పఞ్చ ముఖ్య
ఖ్యవిప్రాశ్చ తూపవిప్రా సధోశ్రుణు॥౨౮॥ ఆద్యశ్శిల్పాయనశ్చైవ, గౌరవాయన ఏ
వచ। కాయస్థాయన ఆఖ్యాత స్తతో వై మాగధాయనః॥౨౯॥ బ్రాహ్మణానాం శిఖా
సూత్రం ముఖ్యానాం పరికీర్తితం తథాచైవోపవిప్రాణాం విహితం చ కుకిరించినా॥౩౮॥
... శిల్పాయనస్య యే పుత్రా స్తేషాం జ్యేష్ఠశ్చ లోహుత్ప్రత్ సూత్రధారః ప్రస్తరారి

క॥ పూర్వోత్తరసందర్భాల్ । తార్వాతకికొంగలేక తత్సభ దానిన్
మురుద్వాన దాఖల్చేసిన౯ । బేర్వాసింగాంతురట వె పృథ్వింబత్తుల్ ॥ 107

క॥ హరికృష్ణువాక్కే మొదటికి
సరియగుమానంబుగాదు, సకలపురాణాల్
పరికించిద్రాసి నాడన
నరసితి, మయ్యదియు నన్నృతమె కనుపట్టె౯ ॥ 108

తే॥ ఆది "లైంగే శివాగమే" యనుచుం గాన౯
బడెడిఁ బాంచాలబ్రాహ్మణప్రకరణమున
అరయ "లింగపురాణశివాగమోక్తు
లవ్వి" యనియగుఁ బ్రాజ్ఞుల కర్థమచట॥ 109

క॥ లింగపురాణమునందీ । సంగతియేకానఁబడదుసరిగఁబరింప౯
దొంగప్రమాణములన కెటు । లంగీకార్యంబులొనుహరికృష్ణునుడుల్

క॥ మంచిదియంగీకార్యమె । యుంచుమవచించుదమగాక హరికృష్ణునుడి౯
పాంచాలబ్రాహ్మణతిరు । సంచితమైనట్టిహేతువగుపడదచట౯ ॥

క॥ అగుపడక పోవుఁగాకది । తగవిశ్వబ్రాహ్మణులుగఁదామునుండుచు నె
ట్టుగఁబాంచాలబ్రాహ్మణు । లగుదురుమన వాగుమరలనాలోచింప౯

---

సామశ్రీకారప్పువర్ణకః ॥౪౦॥ ...............శిల్పవేదశ్చశిల్పానాం పంచానాం
పరికీర్తితః అధ్యయనంచతత్రైవ సంహితాపంచకంస్మృతం॥ ౪౧॥ శిల్పాయనసుతో
జ్యేష్ఠో మన శ్శిష్యత్వమేత్యవై । పపాఠసంహితామాద్యాం ధాతువేదస్యలోహ
కృతి ॥౪౨॥ సూత్రధారోద్వితీయోథ మయశిష్యత్వమాదరాత్ సంహితాం సూత్రధా
రాఖ్యా మపఠత్కాష్ఠకమేవచ ॥౪౩॥ శిల్పాయనసుతస్త్వష్టా శిల్పేశ్శిష్యత్వమాదరాత్
సశైలసంహితాంతస్మా త్పపాఠభృగునందన ॥౪౪॥ అథతామ్రకరశ్శిష్య శ్శిల్పకస్యాభి
వత్పురా । శిల్పాయనసుతస్తుర్య స్సపఠత్తామ్రసంహితాం ॥౪౫॥ నాడింధమోథశి
ష్యోభూ ద్దైవజ్ఞస్యైవపంచమః । సుతశ్శిల్పాయనస్యైవ పపాఠస్వర్ణసంహితాం ॥౪౬॥
పాంచాలా మానవా ఏతే ఏతేషాంసంతతిస్తథా ॥౪౭॥మృత్యులోకేచతేసర్వే ఊపబ్రా
హ్మణసంజ్ఞకాః అథైషాందేవతాఃపంచ విశ్వకర్మముఖోద్భవాః ॥౪౮॥ మను ర్మయ
స్తథా త్వష్టా శిల్పశ్చైవ స్తథైవచ దైవజ్ఞఃపంచయుబ్రహ్మా [illegible] యుజ్ఞ [illegible]॥౫౦॥

తే॥ మేక మెడఁ జన్నులట్లు మన్మిత్రతతికి
విశ్వపాంచాలతల్ రెండు వెలయుఁగాక
అష్టపబ్రాహ్మణత్వంబె యందుఁగాని
వాస్తవబ్రాహ్మణత్వంబు వచ్చుటరిది॥ 113
తే॥ వ్రాసి బ్రాహ్మణభేదముల్ వరుసనతఁడు
కోర్కెఁ బలితులకును గుండగోళకులకు
నడుమఁ జేర్చెను బాంచాలనామకులను
అతఁ దాత్పర్యమేమొనో యరయుఁడింక॥ 114
తే॥ మాని బ్రాహ్మణవర్ణమఁ మాటవీరు
మొదలు పెట్టిరి బహుకాలమునకు మున్నె
కానఁ దల్లిఖితంబులో కారికలెవ్వొ
దొరకె హరికృష్ణుఁ డచ్చోట దూర్పవచ్చు॥ 115
తే॥ బ్రాహ్మణోత్పత్తిమార్తాండపక్తియెల్ల
నీవిధంబుగ నెయుండు నెంచిచూడ
పుక్కిటిపురాణములు దానఁ బుట్లుపుట్లు
కలవుగాని ప్రమాణవాక్యములు లేవు॥ 116
తే॥ సంకరబ్రాహ్మణులటంచు సాహసించి
వ్రాయఁజాలకి యనె నుపబ్రాహ్మణులని
కాని యటు తాదృశపురాణకారుఁడైన
నతనిభావంబు బ్రాహ్మణులను టఁగాదు॥ 117
కం॥ *ప్రాగుక్తసానగాదులు। యాగంబులలోన నెపుడొ యార్త్విజ్యంబున్
బాగుగ నొనర్చిరసియును। సాఁగెఁ మనస్వర్ణకారశాస్త్రివినుండీ॥ 118

*పైనిఁ జెప్పబడిన 5గురుఋషులును కృష్ణయజుర్వేదము 4వ పుటలో యాగములయందు ఋత్విజ్యముచేయువారని చెప్పఁబడియున్నది.

*కృష్ణయజుర్వేదము 4వ కాండము 3వ ప్రపాఠకము 3వ అనువాకము
మూ॥ ప్రాచీదిశాం వసంతఋతూనా మగ్నిర్దేవతా... సానగఋషిః
వి॥ భా॥ హే ఇష్టకే దిశాంమధ్యే యా ప్రాచీ సా త్వమసి-ఋతూనాంమధ్యేయో వసం

ఉ॥ ఇంతకుమున్ బురాణములవి చెప్పెఁబ్రమాణముగాఁగ, నవ్వి యా
వంతయునిల్వనయ్యె, నిపుడాతఁడు కృష్ణయజుస్సులోని కొ
క్కింతప్రవేశముం గలిగె, నిన్ బ్రకటింతుల్, మనతప్పటూహాలా
ప్రాంతము వోనదక్షులు, భాష్యము తేల్చెఁ దదర్థమంతయున్ ॥119
కం॥ చయనంబున నొకక్రియను। య్యాయుదిశలందిష్టకములనమరు నుపల్లన్ని
యమమునను షుప్రముఖత్రంబులుయున్నది యితఁడుచూపునయ్యాదిచూడన్
కం॥ ఆయాయిదెసలనుంచుచు నాయిటికల "సానగాదు తైతిరిమా" రం
చాయజమానుండనినటు। లేయర్థం, బుండదంత కెన్నఁడు వినుచున్ ॥
కం॥ చదివినవి పంచకావ్యాల్
చదివించినగురులు బ్రహ్మజాతులు కారం
చెదియో వదగన్ మొదలిడె
నదకిఁక నిగమార్థసారమొగి లెక్కిడినో॥ 122
చ॥ అత్రియుఅత్రి లేకటుల్ స్మృతి కపార్థము చెప్పినఁ గోర్టువారి కా
పరిచితి లేసి హేతువున భర్త్సనసేయక యూరకున్న వా
రిటుఁగని వారికెల్లరకు పందలియర్థము విప్పిచెప్పి యా
పురుషుని బైసుమం గడిగిపోయక పండితు లూరకుందురే॥ 123
తే॥ *పిలువ రహూభూను త్వష్టయన్ పేరనెవరు

---

*అహూభూనఋషియే త్వష్టయని పిలువఁబడును. అహూభూనునకు విశ్వరూపాచార్యుఁడను కొడుకుండెను. అతఁడు దేవతలకుఁ బురోహితుఁడు - కృష్ణయజుర్వేదము ౯వ పుటలో నిట్లు చెప్పఁబడియున్నది.

---

తస్త్ర ద్రూపాసి- దేవతానాంపశ్యే యోగ్ని స్త్రద్రూపాసి...ఋషీణాంపశ్యే యస్సాన గాఖ్యఋషి స్త్రద్రూపాసి,
మా॥ దక్షిణాదిశాం గ్రీష్మఋతూనా మింద్రో దేవతా...సనాతనఋషిః
ప్రతీచీదిశాం...అహూభూనఋషిః
ఉదీచీదిశాం...ప్రత్న ఋషిః
ఊర్ధ్వాదిశాం...సుపర్ణఋషిః
*కృష్ణయజుర్వేదము ౯వపుట
మూ॥విశ్వరూపోవై త్వాష్ట్రః పురోహితో దేవానా మాసీత్,

పిలుతురో పిల్వరో దాని నిలుఁవుడట్లు
*విశ్వరూపునితండ్రియై వెలయుత్వష్ట
యదితినందనుఁడౌఁగాని యతఁడుగాఁడు॥ 124

సీ॥ పంచవక్త్రంబులఁ బరఁగెడియాతఁడె
భావింప శాస్త్రవబ్రహ్మయనియు
విశ్వసృష్టిస్థితి విలయాదికములెల్ల
నాతనినుండియే యైనవనియు
బ్రాహ్మణులైనట్టి త్వష్ట్రాదులేన్గుర
ప్పురుషవక్త్రములందుఁ బుట్టిరనియు
తమజాతివారికిఁ దత్త్వష్ట్రముఖ్యులే
మొగి మూలపురుషులై యుండిరనియు
చెప్పుకొనుచుండువీరల కెప్పుడేని। విబుధగురుభాగినేయుఁడౌ విశ్వకర్మగాని
యవ్విశ్వరూపుండుగానిమరలు। నెన్నఁసంబంధులగుదురో యెఱుఁగఁబడదు॥

---

†విష్ణుపురాణము ౧రవపుటలో విశ్వకర్మ బృహస్పతి చెల్లెలికుమారుఁడని చెప్పఁబడినది. ‡భాగవతములో ద్వష్టకుమారుఁడు త్వాష్ట్రుఁడనియు దేవేంద్రుఁడు విశ్వరూపాచార్యుని బురోహితుని గానుండుమని ప్రార్థించెననియు నతఁడు బ్రాహ్మణుఁడనియు వర్ణించియున్నాఁడు.

---

*భాగవతము షష్ఠస్కంధము

వ॥ ...అదితివంశంబును విదితంబుగావినిపించెద సావధానుండవయి వినుము, వివస్వంతుండును నర్యముండును బూషుండును ద్వష్టయును సవితయును భగుండును ధాతయు విధాతయు వరుణుండును మిత్రుండును శక్రుండును నురుక్రముండును నను మనువుల జన్మించి రందు...ద్వష్టకు దైత్యానుజయైన రచనయను కన్యకను నధిక బలాఢ్యుండగు విశ్వరూపుండు పుట్టె

†విష్ణుపురాణము ౧వఅం ౧౫వఅధ్యాయము

శ్లో॥ బృహస్పతేస్తుభగినీ వరస్త్రీ బ్రహ్మచా... విశ్వకర్మామహాభాగ స్తస్యాం జజ్ఞే ప్రజాపతిః,

‡భాగవతము షష్ఠస్కంధము

శ్లో॥ తద్విశ్వరూపం భజతాశువిప్రం తపస్వినం త్వాష్ట్ర మథాత్మవంతం ...వృణీమహే త్వోపాధ్యాయం బ్రహ్మిష్ఠం బ్రాహ్మణం గురుం,

చెప్పిరి? వారికిఁ జెప్పినప్పుడు వీరి స్వార్థపరత్వము భంగము గాలేదా? ఇఁక స్వార్థపరతచేత స్త్రీశూద్రులకు వేదశాస్త్రములు చెప్పలేదనుట న్యాయమెట్లగును? ఒకవేళ క్షత్రియులు ప్రభుత్వము గలవారగుటను వైశ్యులు కృషిగోరక్షవాణిజ్యాదులవలన ధనవంతులై యుండుటచే క్షత్రియులవలన నగరాధికారమును వైశ్యులవలన ధనప్రాప్తికమును నాశించియుండి ప్రత్యుపకారముగా వారికి వేదశాస్త్రములఁ జెప్పిరనియు స్త్రీశూద్రుల వలన నట్టిలాభములు లేమిఁ జేసి వీరికిఁ జెప్పలేదనియుఁ జెప్పెదరా? స్త్రీలవలన సర్వ సౌఖ్యముల ననుభవించుచున్నారు. "శూద్రస్తు ద్విజశుశ్రూషా" యను శాస్త్రమున ననుసరించి శూద్రులవలన శుశ్రూషాలాభమును దాము పొందుచున్నారు. అప్పుడు ప్రత్యుపకారబుద్ధితో క్షత్రియవైశ్యులకు వేదశాస్త్రములఁ జెప్పియున్నయెడల నట్లే స్త్రీశూద్రులకును వేదశాస్త్రములఁ జెప్పవలసిన యావశ్యకము బ్రాహ్మణులకుఁ గలిగియే యున్నది. అట్లేల చెప్పలేదు? దీనివలన బ్రాహ్మణులు స్వార్థపరులై స్త్రీశూద్రులకు వేదశాస్త్రములఁ జెప్పలేదను వాదము నిరాకరింపఁబడుచున్నది. క్షత్రియవైశ్యులకు వేదశాస్త్రములను జెప్పి స్త్రీశూద్రులకు నని చెప్పకపోవుటకుఁ గారణము భారతము చెప్పినట్లు "స్త్రీశూద్రద్విజబంధూనాం త్రయీ న శ్రుతిగోచరా" అనఁగా స్త్రీలకు శూద్రులకు ద్విజబంధువులకు వేదత్రయము శ్రుతిగోచరము కాఁగూడదను నిషేధ మనుసరించి చెప్పలేదని చెప్పుట సర్వసమంజసమై యున్నది. ఒకవేళ శూద్రులయందలి జాతిద్వేషముచే నన్నట్లయినఁ జెప్పలేకపోయిరా? అట్లు లేని శూద్రజాతియందువలెనే స్త్రీజాతియందును వారికి జాతిద్వేషము కలదని చెప్పవలయును. బ్రాహ్మణేతర జాతులయందుమాత్రమే స్త్రీజాతియుండి బ్రాహ్మణజాతియం దనిలేనప్పుడు కదా వారికి స్త్రీజాతియందు ద్వేషముండుటకు నవకాశముకలుగునది? లేనప్పు డదియెట్లు చెల్లును? ఒకవేళ శ్రుతిస్మృతిపురాణేతిహాసములనురచించిన బ్రాహ్మణులకు స్త్రీజాతియందు ద్వేషముకలదందురా? వారికి మాత్రము తల్లి తోఁబుట్టువు భార్య బిడ్డ, లోనగువారు లేరా? లేనియెడ వారెట్లుజన్మించిరి? ఉండిరా? ఉండినఁదమతల్లి తోఁబుట్టు భార్య బిడ్డలను స్త్రీజాతియందలి ద్వేషముచే విద్యచెప్పలేదని చెప్పెడి వీరిబోధను జనులు విశ్వసించుటకంటె వివేకహీనత్వమును స్వభావవిరుద్ధకార్యమును వేఱుగనుండదని ఘంటాపథముగ సాటింపవచ్చును. ఇదియిట్లుండనిండు. మనసోదరులు చెప్పిన "యథేమాంవాచం" అను మంత్రమునందు స్త్రీలకు వేదము చెప్పవలయునను నర్థము గలపద మెక్కడనున్నది? స్త్రీలనుగుఱించి చెప్పకపోయినను శూద్రులకు వేదము చెప్పుమని కలదుకదాయందురా

వేదములను శూద్రులకు జెప్పుమనుమాట యందెచటనున్నది? అదేమి « యథేమాం వాచంకల్యాణీ మావదాని జనేభ్యః » అని చెప్పఁబడియుండలేదా? అని చదివెరుగరా? జనులకెల్లను శుభప్రదమైన యీవాక్యమును జెప్పుచున్నాననికలదు కాని యందు వేదములను సర్వజనులకెల్లను జెప్పుచున్నానను వచన మెచటఁ గలదు? లేనప్పుడు నట్టుగను చేయవలయునని యెందుకు? అట్లు చేసినయెడల శూద్రులకు వేదములను దప్పక చెప్పితీరవలసినదని తేలునుగదా? తేలదు. అప్పుడు వారి కుపనయనము చేయవలసిన యావశ్యకత కలుగుచున్నది. శూద్రుల కుపనయనముఁ జేయవచ్చునని మన యార్యసామాజిక సోదరు లేగ్రంథమునందైన వ్రాసియున్నారా? అది నిషిద్ధమని వివరించినను శాస్త్రగ్రంథములందు గానరాదు. ఇఁక శూద్రులకు వేదము చెప్పుటెట్లు? అనుపవీతులగు స్త్రీశూద్రులకు వేదపఠనాధికారము లేదని శాస్త్రములందుఁ జెప్పఁబడియున్నది. ఆధారము సత్యమైయున్నది. ఇట్లుండఁగా నుపనయనసంస్కారమె చెప్పఁబడని శూద్రసోదరులకు వేదపఠనాధికార మెట్లు సంభవించును? ఒకవేళ శూద్రసంఘము [illegible] వారి కుపనయనము గావించి వేదములఁ జెప్పుట కారంభింతుమందురా? అటులేని శూద్రుల కుపనయనముఁ జేయఁగూడదనియు వేదములను విడిచి యితరశాస్త్రములు చెప్పవచ్చుననియు నీకలహకారకులైన యార్యసమాజసంస్థాపకాచార్యులగు దయానందసరస్వతీస్వాములవారె తమ సత్యార్థప్రకాశ నామక గ్రంథరాజమునందె 52పుటలో వారిశ స్వహస్తములతోడనే వ్రాయుచియున్నారు. ఆ కనకాక్షరవిన్యాస మిటఁ బ్రదర్శించుచున్నారము « బ్రాహ్మణ స్త్రయాణాం వర్ణానా ముపనయనం కర్తుమర్హతి రాజన్యో ద్వయస్య వైశ్యో వైశ్యస్యైవేతి, శూద్రమపి కులగుణసంపన్నం మంత్రవర్జమనుపనీత మధ్యాపయేదిత్యేకే » ఇది సుశ్రుతము యొక్క సూత్రస్థానమందలి రెండవ అధ్యాయపు వచనము. బ్రాహ్మణుఁడు మూఁడువర్ణములకు అనఁగా బ్రాహ్మణక్షత్రియవైశ్యులకును క్షత్రియుఁడు క్షత్రియవైశ్యులకును వైశ్యుఁడు వైశ్యవర్ణమునకును, యజ్ఞోపవీత మొసఁగి చదివింపనగును. శూద్రుఁడు కులీనుఁడును శుభలక్షణయుక్తుఁడు నయ్యెనేని వానికి మంత్రసంహితనువదలి తక్కిన సమస్తశాస్త్రములు చదివింపవచ్చును. శూద్రుఁడు చదువను వచ్చును. కాని యతనికి నుపనయనముఁ జేయఁగూడదు. అని యనేకాచార్యుల మతము » అని తెగవేసి వ్రాసిరి. దీనిఁబట్టి శూద్రుల కుపనయనము చేయరాదనియు వేదములు చదివింపరాదనియుఁ బరార్థపరులైన యార్యసామాజికులె స్థిరపఱచియున్నారు. ఇట్లుండఁగా బ్రాహ్మణులు స్వార్థపరులై శూద్రులకు వేదములఁ జెప్పలేదనుట

కదా౽ంగడు నింద్యము గాదా? ఇట్లు స్వవచనవ్యాఘాతములతో గ్రంథములు వ్రాయుటవలన ధర్మములు చెడుటయు కాక కలహములు వృద్ధియై సంఘము క్షీణించదా? సంఘమైకమత్యమాచరించెడివారలు సంఘసంస్కారులెట్లుకాఁగలరు?

ఇప్పటికాలపు మనసోదరులకుఁ బూర్వకాలపుమహర్షులవాక్యములందుఁ గాని మధ్యకాలపుఁ బండితులవాక్యములందుఁ గాని యాధునికపండితవాక్యములందు గాని యుండు గౌరవముకంటె వేయిమడుంగు లాంగ్లేయపండితవాక్యములందు గౌరవముకలదు కాన వారివాక్యముల నీసందర్భమునఁ గొన్నిటిఁ జూపుచున్నారము. ఆంధ్రవారపత్రిక **27-8-13** తేదిగలసంచికయందు డాక్టర్ యమ్. యస్. పెంబ్రీ యమ్; ఏ గారిట్లు వ్రాసియున్నారు. "స్త్రీల కున్నతవిద్య చెప్పవలయునని యేమేమో చెప్పెదరు-ఉన్నతవిద్య స్త్రీకిఁ గాని పురుషునకుఁ గాని రాజ్యమునకుఁ గాని మంచిదికాదు. మూడునాలుగుసంవత్సరము లెంతయో పనిచేసి యున్నతవిద్యనభ్యసించుటవలన శరీరదార్ఢ్యము నశించును- ధనము వ్యయమగును. బుద్ధి యెంతయో వినియోగింపవలసియుండును. ఈగణముల నన్నిటిని వివాహమునకె వినియోగించిన యెంతయో లాభము చేకూఱును. సగముకాలముగడచినవిద్యావతి యితరులకంటె భార్యగఁ గాని తల్లిగఁ గాని యాధిక్యతఁ గలిగియుండుననుటకు నిదర్శనము లెవ్వియును లేవు. సంగతిసందర్భములన్నియు దీనికి భిన్నముగ నేయున్నవి......ఒక్క సంగతినిమాత్ర మంగీకరించుచున్నారు. జను లెంతో విద్యార్థులుగా నుందురో యంతతక్కువసంతానము నుత్పత్తిఁ జేయుదురు." అనిస్పష్టముగా స్త్రీలకేకాక పురుషులకుఁగూడ నున్నతవిద్య కూడదని పరదేశపు వైద్యశాస్త్రజ్ఞులు, తమదేశములో స్త్రీల కున్నతవిద్యనిచ్చి యందువలన నష్టములఁ బొంది యానష్టములను సూచించుచు వ్రాసియున్నారు. త్రికాలజ్ఞులగు మనపూర్వులీవిషయమును వేలసంవత్సరములక్రిందటనే కనిపెట్టి స్త్రీల కున్నతవిద్య పనికిరాదని వ్రాసియున్నారు. ఇట్లుండఁగా మనసోదరులు బాల్యవివాహములవలన స్త్రీల కున్నతవిద్యాభంగమగుచున్నదని వాదించుట హాస్యాస్పదముగానున్నది.

అందఱిమేలుకొఱకు వెడలిన వేదముల నందఱును జదువరాదనియుఁ గొందఱుమాత్రమె చదువవచ్చుననియుఁ జెప్పుట యుచితమాయని యడిగెదరా? తాము తలంచినట్లు వేదములు సర్వులకును శుభావహకార్యములను బోధించుటకు వెడలినమాట సత్యమె. కాని యంతమాత్రముచే వాని నందఱును బఠింపవచ్చునని చెప్పుటమాత్రము సరిగాలేదు. అటులుండుట యేల? రాజ్య మందఱిమేలుకొఱకు స్థాపింపఁబడిన

హ్మణకన్యలు చండాలాదిసంపర్కము నపేక్షించి కులహానిం గావింతురు, నియేకదా షం దసత్యమేమున్నది! రజస్వలయు స్వయముగా నిష్టమువచ్చినవానినివరింపంబోవు కన్య తనచిత్తమునకువచ్చిన చండాలునివదలి యిష్టములేని బ్రాహ్మణుని వరించునా! అట్లువరించవలయునా! అట్లులేని యెడ స్వయంవరవివాహ మెట్లగును; అప్పుడు వర్ణ భేదము కన్యాస్వయంవరమునకుం బ్రతిబంధకముగాచుండ లేదా! దానినేలపాటింప వలెను? వర్ణభేదములు సంఘోపకారకములగునా! అగునని మునరావుగారు తలంచుచున్నారా! తలంతురేని "హిందూదేశమునుబాధించుచున్నవి రెండు ముఖ్యవిషయములుకలవు. (1) వర్ణభేదము (2) అతిబాల్యవివాహములు" అని వ్రాయరుగదా? వర్ణభేదములు సంఘబంధకములనివ్రాసిన రావుగారు "బ్రాహ్మణ స్త్రీలు చండాలాదిసంపర్కముచేతురనిన నాగ్రహపడి దూషించుట నిషిద్ధముకాదా,

అతిబాల్యవివాహములు మనహిందూదేశమును బాధించుచున్నవని మునరావు గారు వ్రాసియున్నారు. ఈవిషయము వీరు తెలిసివ్రాసినారా! లేదు, ఇతరులువ్రా యంగాం జదివి యీమాటవ్రాసినారు. అదెట్లనెదరా! "ఈరెండును (వర్ణభేదము, అతి బాల్యవివాహము) దేవునికృపవలన స్థిరముగనుండునంతకాలము బ్రిటీషుదొరతనమువారు హిందూదేశసామ్రాజ్యమును నిర్భయముగా నలువదివేల సోల్జరుపటాలములతో నేలుచు ముప్పదికోట్లజనుల నిభిన్నతఖండముగ నున్నవారినాయట పాటింపనక్కఱలేదని కొందఱు పాశ్చాత్యపండితులు వ్రాసియున్నారు" అని మునరావుగారువ్రాసినదానింబట్టి తెలియ వచ్చునది. నల్లదొరలగు మనసూర్యప్రకాశరావుగారికవలనె తెల్లదొరలగు నిపాశ్చాత్య పండితులకుంగూడ లోకానుభవము లేనట్లు దోంచుచున్నది. ఏదియన హిందూదేశము న హిందువు లొక్కరె నివసించియుండుటలేదు. మహమ్మదీయులు పారసీకులు క్రైస్తవులు, లోనగువారు వసించుచున్నవారు. వారు హిందువులవలె వర్ణభేదములు బాల్యవివాహములు కలవారుకారు. ఇంగ్లండునకు దగ్గరనుండు జనసంఖ్య యెంతగలదో హిందూదేశములోని మహమ్మదీయజనసంఖ్య యంతగలదు. జైనులు బౌద్ధులును క్రైస్త వులయు జనసంఖ్య మిగిలియున్నది. హిందువులు వర్ణభేదముంబాటించునువారలో నధికసంఖ్యాకులగు శూద్రయశూద్రసంఘములవారు రజస్వలావివాహములం గావించు చున్నవారని మునసంపాదకులె చెప్పుచున్నవారు. కావున వీండ్రును రజస్వలా వివాహములను జేసికొనుటవలన బలవంతులైయున్నారనుటకు సందేహములేదుకదా. ఇంక వారివాదమునుబట్టి శాస్త్రీయవిషయముల గౌరవించువారు బ్రాహ్మణులు

వైశ్యులు స్వర్ణకారులు లోనగువారికడ నీగంధమును జేయించుమించుగా 6 కోట్లు జనులుండవచ్చును. హిందూదేశమునఁగల ముప్పదికోట్లజనులలో నైదుకోట్లజనులుమాత్రమె బాల్యవివాహములం గావించుకొని బలహీనులైయున్నారని తెలియవచ్చుచున్నది. ఇట్లుండఁగా (హిందూదేశమున 25 కోట్లజనులు రజస్వలావివాహములవలన బలవంతులైయుండఁగాను, ఇంక 5 కోట్లప్రజలు వర్ణభేదములులేక శక్తిసంపన్నులైయుండఁగాను) నీవిషయమును గ్రహింపని పాశ్చాత్యపండితులు ''బ్రిటీషుదొరతనము వారునిశ్చయముగా నలువదివేలసోల్జరుపటాలములతో నీ ముప్పదికోట్లజను లీభరతఖండమున నున్నారనుమాట పాటింపనక్కఱలేదు'' అని వ్రాయుట లోకానుభవజ్ఞానవిహీనతచేత నేయనియును నిరాటంకముగాఁ జెప్పవచ్చును. వారియుక్తులనునమ్మినమనరావుగారికి నదియోగతి.

మనరావుగారు ''వేదశాస్త్రపురాణములు మనమతముల కాధారములైనచో వానిచెప్పిన నడుచుట మనకుఁగర్తవ్యమైనచో వానిలో నెచటనైన బాల్యవివాహములకు దృష్టాంతములుకలవా? బ్రహ్మవిష్ణుమహేశ్వరులభార్యలును సప్తర్షులభార్యలును వేదఋషులపత్నులును రామాయణభారతభాగవతాదిగ్రంథములయం దుదాహరింపఁబడిన ప్రసిద్ధపురుషుల భార్యలును కన్యలుకారు; రోహిణులుకారు; గౌరులుకారు; వారందఱు రజస్వలలు, అని వ్రాయుచున్నారు. ఈవాదమునుగూర్చి యిదివఱకు దేవయాన్యాదిపరిణయములంగూర్చి ముచ్చటించినచోట విపులముగాఁ జర్చించియుంటిమి. ఐనను ముఖ్యములగు సమాధానముల నిట వ్రాయుచున్నారము. బ్రహ్మవిష్ణ్వాదిదేవతలయుఁ గశ్యపాదిమహర్షులయు స్మృతులు మనకుఁ బ్రమాణములగును గాని వారిశీలము (అనుష్ఠానము) నిబద్ధముకానియెడల నదిమనకుఁ బ్రమాణముకానేరదు. వేదవిదులైనవారికని వేదము ప్రమాణమైయున్నది. ఈవిషయము ''వేదో ధర్మమూలం'' అను గౌతమసూత్రముచే దృఢపఱుపఁబడియున్నది. ''తద్విదాంచ స్మృతిశీలే'' ఇందులకు భాష్యము ''తద్విదాం వేదవిదాం మన్వాదీనాం యా స్మృతిః తత్ప్రణీతధర్మశాస్త్రం యచ్చశీల మనుష్ఠానం గ్రంథే నిబద్ధం తే స్మృతిశీలే అస్మదాదీనాం ప్రమాణం, నచ తేషామనుష్ఠానం'' అనఁగా వేదవిదులైన మన్వాదులచేఁ జెప్పఁబడిన ధర్మశాస్త్రములును వేదనిహితములైనవారి యనుష్ఠానములును మనకుఁ బ్రమాణములు. కాని వారి కేవలానుష్ఠానము మన కాచరణీయముకాదు. అదేలయనఁగా ''యదిశీలమపి ప్రమాణం [illegible]

మహేశ్వరుండును స్థాణుండును బశుపతియును విష్ణుండును నీశానుండును నీశ్వరుండును బరుండును హరుండును బురుషుండును బరమేశ్వరుండును బురాణుండును బరముండును బూర్ణుండును బరాకాష్ఠయును బరాగతియును బతియును దేవుండును కర్తయు భర్తయు స్రష్టయుఁ బురాతనుండును మహాత్రిసుండును మహాధారుండును నాత్మవిద్యాధికుండును బ్రభుండును మహాత్ముండును విభూతియును కాలాగ్నియును నాకాశంబును హరియును నవ్యయుండును బ్రాణజ్యోతియును భీముండును నంతర్యామియును సనాతనుండును సతీరుండును దహరుండును సాక్షాదపరోక్షుండును స్వయంప్రభుండును నసంగుండును నాత్ముండును నిర్ద్వంద్వుండును బ్రత్యగాత్మాదిసంజ్ఞితుండును నుమాసహాయుండును భగవంతుండును నీలకంఠుండును ద్రిలోచనుండును బ్రహ్మవిష్ణురుద్రుల చేత హృదయంబున సదోపాస్యమానుండును సర్వాత్ముండును సర్వవస్తువివర్జితుండును వృషధ్వజుండును నగు బరమశివుండు కృపాళుండై కేవలంబుగా విశ్వమూర్తియగు విష్ణుమూర్తి ననుగ్రహించి మధుర వాక్యంబుల నిట్లనియె, 13

ఉ॥ "ఘోరతపంబు చేసితివి, కోరిక లేమి, ప్రసన్నమూర్తినై
చేరితినిన్ను, చెప్పు"మన శ్రీహరి భక్తిఁ బ్రదక్షిణత్రయిన్
గూరిమిఁ జేసి దండగతిఁ గుంభినిపై బహుసన్నుతిక్రియల్
సారమతిన్ రచించి విశ్వాత్మమనోవిషయప్రవృత్తియై॥ 14

తే॥ సాంబ శంభు మహానందసాగరు శివు
నాగళంబుగఁ గొంతసే పక్షియుగళిఁ
గాంచి యంతఁ బ్రమత్తుఁడై కమలనయనుఁ
డీశుకంటెను నొండేమి యెఱుఁగఁడయ్యె 15

వ॥ అంతఁ బ్రబుద్ధప్రసన్నస్వభావుండై భగవంతుఁడైనవిష్ణుండు 16

ఉ॥ లోచనయుగ్మముం దెఱచి లోకపతిం గరుణాఢ్యు నీశ్వరున్
జూచి "మహేశ! శంకర! విశుద్ధనిజాకృతి భూతభవ్యముల్

గోచరమగునుసీకు నధికోన్నత! ముక్తిని ముక్త్యుపాయమును
మోచకు మోచకప్రదుని ముక్తిద! నాకెఱుఁగంగఁజెప్పవే॥ 17

తే॥ ఇంకఁదెలియంగవలసిన వేమికలవొ
యన్నియును జెప్పు నాకు శ్రద్ధానురక్తి
వినఁగఁగోరితిఁ దేవేశ!" యనిన శంభుఁ
డాదరంబున నమ్మాట లాలకించి 18

మ॥ అఖిలాధీశ్వరిఁ బార్వతీరమణి సాహ్లాదంబుగాఁ జూచి స
న్ముఖపద్మంబున నవ్వు శోభిలెడు మునులెల్ల బూర్ణానుకంపాధుర్యుఁడై
నిఖిలాధీశ్వరుఁ డంబికాసహితుఁడై నీరేజపత్రాక్షుతో
సుఖలీలంబలికెన్ "జగద్ధిత మహాహా! సూచించునీప్రశ్నమున్"॥

తే॥ అను మిమాటయిట్లు పల్కె "నంబుజాక్షి!
శ్రద్ధచేతను వినుమిద సంగ్రహముగఁ
దెలియఁజెప్పెద, శుభమగుదీనివిని
మోక్షమార్గంబులందిది ముఖ్యమగును॥ 20

సీ॥ వేదాంతములయందు వినఁబడుముక్తిదా
బహువిధంబుల సితకంఠజాక్షి!
సాలోక్యసామీప్యసారూప్యనామంబు
లనముఁడువిధములై యమరు, నవల
షడ్భావసుఖదుఃఖసంగతిద్వంద్వశు
భాశుభరహితయైయెఱఁగిసత్య
విజ్ఞానరూపయై విమలసుఖాఖ్యయై
బ్రహ్మస్వరూపయైయెఱఁగిసర్వ

గీ॥ జంతువులకాత్మభూతయైస్వప్రదయయి
మేయగాకయుఁదానుపాదేయగాక
తెలుపనశ్వస్తయును దర్కితయునుగాక
సర్వసంబంధరహితయై సర్వమగుచు॥

వ॥ మఱియు నెప్పుడు పరమార్థంబువలనఁ బ్రతిబంధరహితయు నవిచారదశయందు స్వమాయచేతఁ బ్రతిబంధయు నాల్గవదియు నగుసాయుజ్యముక్తియే ముక్తియని వేదార్థవిదుల చేతం బలుకంబడు, నింకఁ దారతమ్యంబుచేఁ బ్రవర్తిల్లు, నితరముక్తులు జన్మనాశాభిభూతంబులును స్పర్ధచేతనుపహతంబులును సర్వదాపరతంత్రంబులును సుఖోత్తరంబులును దుఃఖమిశ్రంబులును నయ్యుశ్రేష్ఠంబులై క్రమంబుగామోక్షంబునకు విశ్రాంతిభూములై కొందఱధికారుల కుపయోగింపంబడియుండు, కేవలశుద్ధచిత్తులుగానివారలకు నశ్వరంబులగు నీసాలోక్యసామీప్య సారూప్యంబులు స్వర్గంబునుం బోలె భోగార్థంబులై యుండు నివియు బహువిధంబుల భిన్నంబులై యుండు గొన్ని శంకరసారూప్యంబులును గొన్ని విష్ణుసారూప్యంబులును గొన్ని తద్విభూతి సారూప్యసాలోక్యసామీప్య రూపంబులును గొన్ని బ్రహ్మవిష్ణుమహేశ్వరుల యర్వాగ్రూప సహాశ్రయంబులును గొన్ని సదాశివాదుల రూపసదృశంబులును గొన్ని యన్యసమానంబులును గొన్ని వీరల సామీప్యసాలోక్య రూపంబులన నివ్విధంబున బహువిధంబులై మోక్షంబులు ప్రకాశించు, మఱియును, 22

తే॥ ఇట్టిక్రమముక్తులందున నెప్పుడుఁ దిని
వాంఛవొడము నశుద్ధస్వభావులకును
వారలై ననుక్రమముగాఁ జేరఁగలరు
పరమగతియైన సాయుజ్యపదము శౌరి!॥ 23

తే॥ మత్ప్రసాదంబుగలశుద్ధమానసులకు
నిచ్చసాయుజ్యమందెదా నెసఁగు నెప్పు
మత్ప్రసాదవిహీనులౌ మానవులకు
నిచ్చ కేవలముక్తియం దేమి లేదు॥ 24

సీ॥ నిగమార్థనిష్ఠులై నయతి ముద్భక్తులై
యధికులైనట్టి మహాత్ములకును

సతతపరివృత్త్యుపరతియందు సాయుజ్య
మందును శ్రద్ధ దా నతిశయిల్లు
జీ(వాత్మ)పరమాత్మ కేవలతాదాత్మ్య
రూపైక్యతాసిద్ధి రూఢమైన
సాయుజ్యముక్తి నాఁజను, నిదియజ్ఞా(ని)
తాత్త్వికుండైన ముముక్షువులకుఁ
గీ॥ గలుగుననుచును వేదాంత మెలమిఁదెలుపు
నెవ్వనికిఁదాస్వభావమౌ నిట్టిముక్తి
యతఁడె నేనౌట నిత్యము బ్రహ్మవిదులు
సంశయము లేదుదీనికి జలజనేత్ర॥

కం॥ అరయఁగ స్వరసిద్ధాంత। స్ఫురణంబగుముక్తిపదము పొల్చునవిద్యా
వరణంబువాయుముక్తత। వెరవొప్పఁగ దగ్ధవస్త్రవిధమగుఁగాదే

వ॥ ఎవ్వని(కి)స్వతస్సిద్ధాంతరూపిణియగుముక్తి యభివ్యక్త యగు నాతనికిఁ బ్రారబ్ధకర్మాంతంబు జీవన్ముక్తియగు, ప్రదీప్తంబగు ప్రపంచంబె జీవనంబగు, ఫలోపభోగంబువలనఁ బ్రారబ్ధకర్మక్షయంబగుడుఁ బ్రపంచప్రతిభాస స్వప్నతుల్యంబుగానివర్తింపఁబడు నతండొకండె ముక్తుండనంబడు, భూతపూర్వానుసంధానంబువలననె ముక్తుండగు నట్టివాఁడు ముక్తుండును బద్ధుండును ముముక్షుండును నన్యుండునుం గాఁడు, నెట్లాత్మయం దాత్మను సుదృఢంబుగానెవఁడెఱుంగు నతండె పరమజ్ఞానియగు, తదితరుండు మాంసావృతుండగు, నే నెఱుంగుదునని సుదృఢంబుగా నెవ్వఁ డాత్మయందుఁ దలంచు వాఁడెమూఢుండును విజ్ఞానవంచకుండును ననంబడు, సందేహంబు లేదు, ముక్తిస్వభావంబు వేదాంతంబులచేతనైన వర్ణింపశక్యంబుగాదు, స్వానుభవంబుగలవానికి మౌనంబెసిద్ధించు, ముకుందా! నాచేతసీకు శ్రద్ధచే ముక్తి దెలుపంబడియె, నీవును శ్రద్ధాయుక్తుండవై శ్రేయఃప్రాప్తికై తెలియు,,మని యుమానాథుండు మానాథునకుఁజెప్పినట్లు సూతుండుశౌనకాదులకుం

## ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు

2. రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహదరు కుమార జమీందారుగారు, గంపలగూడెం.

### సహాయులు.

21 మల్లాది కామయ్యగారు, చింతపల్లిదొరసానిసంస్థానం, గుంటూరు.

22 శివపురపు వీరభద్రపాకయాజిగారు, సికింద్రాబాదు

23 చిప్రుసుల అప్పయ్యశాస్త్రిగారు, గుంటూరు

### ఈనెల సొమ్ము చెల్లించిన చందాదారులు.

1 భువనగిరి కోదండపాణిగారు-సబ్‌రిజిష్ట్రారు-గుడివాడ

2 వెంకటపాపారాయ భారతీనిలయము-మైలవరము

3 పంగనామాల వెంకటరంగారావుగారు-రివిన్యూయినస్పెక్టరు-నెల్లూరు

4 విస్సావఝ్ఝల సీతారామయ్యగారు-నూజవీడు

5 మల్లాది పున్నయ్యగారు-హెడ్డుక్వార్టరు డిప్యూటీకలెక్టరాఫీసు క్లార్కు

6 పెద్దిభట్ల చిననాగేశ్వరరావుగారు.....గుంటూరు

7 భువనగిరి ముకుందరామయ్యగారు-ల్యాండురికార్డ్సుఇనస్పెక్టరు-బాపట్ల

8 ప్రయాగ చంద్రమౌళిగారు-గుంటూరు

9 చించినాడ వెంకటరత్నశాస్త్రిగారు-బెజవాడ

10 దివాకరుని కుటుంబశాస్త్రిగారు-దుగ్గిరాల

11 పిసుపాటి వెంకటరంగయ్యగారు-వంగవోలు

12 నోరి వెంకటేశ్వరులుగారు-ప్లీడరు-బాపట్ల

13 వెడవల్లి కామేశ్వరరావుగారు-ప్లీడరు-బాపట్ల

14 కామరాజుగడ్డ రాఘవయ్యగారు-మండూరు

15 వెలిదెండ్ల సుబ్బారావుగారు-దాచేపల్లి

16 జి. నారాయణరావుగారు-హైకోర్టువకీలు-హైద్రాబాదు

17 వేమూరు చెంచుకృష్ణయ్యగారు-శాకవరము

18 దూపాటి తిరుమల వెంకటరమణాచార్యులుగారు-గంపలగూడెం

19 వేదాంతం వెంకటేశ్వరులుగారు-కుంచవరం

20 చతుర్వేదుల నరసింహంగారు-విప్పర్లపల్లె

21 అన్నంరాజు సుందరరామయ్యగారు-విలేజిమున్సిఫ్-దిగోపాలెం

22 తూము నరసింహారావుగారు-కట్రెంప్రాడి

23 నడింపల్లి లక్ష్మీనారాయణగారు-ఫారెష్టు రేంజీక్లార్కు-బాపట్ల

24 చింతలపాటి రామమూర్తిశాస్త్రిగారు-గుడివాడ

25 అక్కిరాజు శంకరనారాయణగారు-విలేజిమున్సిఫ్-మాచవరము

26 చింతపల్లి చెలమయ్యగారు-కరణం-మేళ్లవాగు

27 రాళ్లభండి రాజయ్యగారు-విలేజిమున్సిఫ్-చింతిరాల

28 కొండపల్లి సుందరరామయ్యగారు-కరణం-వేమవరం

29 ముదిగొండ నాగవీరశా [illegible]

# అభినవసరస్వతి

## పత్రికాధిపతి జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇదియొక మాసపత్రిక - ఇందు ప్రాచీననవీనాంధ్ర ప్రబంధములును, నాటకములును, విమర్శనములును, విద్యావిషయిక మతవిషయిక వ్యాసములును, ప్రకటింపబడును. ప్రాజ్ఞసమ్మతములగు తాత్కాలిక వ్యాసములవలన గలుగు నానందము గాక చందాదారులకు 2-3 అపూర్వగ్రంథము లీయబడును. చందా సంవత్సరమునకు రు 2-0-0

### ఈ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

| | | | |
|---|---|---|---|
| 1 | అళ్వయాచార్యవిజయము ... | ... | 0 4-0 |
| 2 | కరిణీకోద్ధారిణి (పూ॰ వీరభద్రకవి) ... | ... | 0-4-0 |
| 3 | వాసంతికా పరిణయము } ... | ... | 0-4-0 |
| 4 | కంసవధము } ఇవి రెండు నాటకములు | ... | 0-8-0 |
| 5 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | ... | 0-4-0 |
| 6 | విరూపాక్షపీఠగురుపరంపర ... | ... | 0-2-0 |
| 7 | నీతిగీతులు (సుమతి శతకమునకు సంస్కృతము) | ... | 0-2-0 |
| 8 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | ... | 0-2-0 |
| 9 | విగ్రహారాధనఖండనఖండనము. ... | ... | 0-4-0 |
| 10 | చిత్తూరిజిల్లా తీర్పువిమర్శనము (పత్రికాధిపతి) | ... | 0-4-0 |
| 11 | సంగదోషము (సంగదోషముచే బట్టుదలవదలని యోగుల చరిత్ర దెలుపు నొకచిన్న పద్యరూపమగు కథ | } ... | 0-8-0 |
| 12 | వీరభాగవతము (ముదిగొండ వీరభద్రకవి) | ... | 1-4-0 |
| 13 | పుళిందావివాహము ( పత్రికాధిపతి) | ... | 0-4-0 |
| 14 | గురిగింజ, వత్సలనీతిశతకము, వ్యాసనిష్కాసనము, పిష్టపేషణము | | 0-2-0 |
| 15 | శివానందలహరి (తంగెడ రామకృష్ణకవి) | ... | 0-4-0 |
| 16 | లక్ష్మీవిలాసము (రాయసము వెంకటపతి) | ... | 0-4-0 |
| 17 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివేంకటీయము) | ... | 0-8-0 |
| 18 | పశ్యాంపుశ్యాం ,, | ... | 0-2-0 |
| 19 | పశ్యశబ్దవిచారము ,, | ... | 0-2-0 |
| 20 | పురశ్చరణము ,, | ... | 0-2-0 |

 వలయువారలు సొమ్ము పంపిగాని వి. పి. ద్వారాగాని ఈ క్రిందివారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

జానపాటి పురుషోత్తం, సబ్ ఎడిటర్

జానపాడు పిడుగురాళ్ళపోష్టు, గుంటూరుజిల్లా.